# శ్రీరామనవమి







ధర్మప్రచార పరిషత్తు
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీరామనవమి




రచన

**విద్వాన్, డాక్టర్ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

కార్యదర్శి, ధర్మప్రచారపరిషత్, తి.తి.దేవస్థానములు

★ ★ ★

"సత్యధర్మస్వరూపాయ, నమో విశ్వాత్మరూపిణే ।
నవమీపరతత్త్వాయ, శ్రీరామపరమాత్మనే" ॥

★ ★ ★

ప్రచురణ

**ధర్మప్రచార పరిషత్**

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి - 517 501**

# శ్రీరామనవమి

ప్రథమముద్రణ : 2,00,000

ఏప్రిల్ - 2006

అమూల్యము

ప్రచురణ:

**ధర్మప్రచారపరిషత్**
**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి - 517 501**

ముద్రణ : కీర్తి ఆఫ్‌సెట్, తిరుపతి

# ముందుమాట

తిరుమల క్షేత్రం నిత్యవసంతశోభాయమానం! సంవత్సరపర్యంతంగా జరిగే శ్రీవారిఉత్సవసేవలు "ఉగాది ఆస్థానం"తో ప్రారంభమవుతాయి. శ్రీవారు నిత్యవసంత మూర్తి. ఆనందనిలయవాసి. "నిత్యకల్యాణం-పచ్చ తోరణం"గా దినదిన ప్రవృద్ధి శోభల్తో, విశ్వకల్యాణ రూపంలో శ్రీస్వామివారు భక్తకల్పవృక్షమై కలియుగప్రత్యక్ష దైవంగా సకలారాధ్యులై సేవలు కొంటున్నారు.

శ్రీమన్నారాయణుని అవతారాల్లో మానవజాతికి అత్యంతహితమూ, ఆదర్శమూ అయినది శ్రీరామా వతారం! సీతారామలక్ష్మణులూ, భరత శత్రుఘ్నులూ తెలుగువారికేకాక, విశ్వమానవ కుటుంబానికే నిరంతర స్మరణీయ మూర్తులు.

శ్రీరాముని అరణ్యవాసం ఎక్కువభాగం తెలుగు నాటనే జరిగింది. రామావతార ప్రయోజనసిద్ధికి అవసర మైన బీజాలు ఇక్కడే మొలకెత్తాయి. ఆ రాముడే నేటి

మన వేంకటరాముడు! ఇరువురూ ఒక్కతత్త్వమే! వస్తువును ఏపేర్తో పిలిచినా-అందలి గుణంమాత్రం ఒక్కటేకదా!

సుప్రభాతకర్త హస్తిగిరినాథన్ శ్రీవారిని "కౌసల్యా సుప్రజా రామా!" అంటూ విశ్వామిత్రుని వాక్యాన్నే గైకొని - శ్రీరామునిగానే భావించి, స్తుతించినారు.

శ్రీవారి సన్నిధిలో జరిగే ఆస్థాన ఉత్సవాల్లో సీతా రామలక్ష్మణ (ఉత్సవ)మూర్తుల్ని "శ్రీరామనవమీ ఆస్థానం, "శ్రీరామపట్టాభిషేక ఆస్థానం"గా చైత్రశుద్ధనవమి, దశమి - వరుసగా రెన్నాళ్ళు కొలువు నిర్వహించడం - శ్రీవారి ఆలయ అస్థాన ఉత్సవాల్లో ప్రత్యేక విశిష్ట ఆరాధన. ఇట్టి సేవ ఇతరత్ర కన్పించని అపూర్వ దృశ్యం! మరి శ్రీవారు - శ్రీరామ వేంకటేశ్వరుడు కదా! సత్యధర్మాది పవిత్ర గుణ సంపన్నుడైన శ్రీరాముని ఉత్సవాలు శ్రీవారి సన్నిధిలో "ద్వితీయ ఆస్థాన"మైనా అద్వితీయ పద్ధతిలో నిర్వహిస్తుండటం - రామునికీ శ్రీవారికీ గల అభేదాన్ని దృఢంగా నిరూపిస్తున్నాయి. శ్రీ స్వామివారు సర్వదేవతా మూర్తి! సంశయం లేదు. కానీ సకల జన, సమ్మోన

ఆకర్షణ శక్తుల్లో స్వామి రామకృష్ణమూర్తియై ప్రకా శిస్తున్నాడనుట తథ్యం!

అందరి హృదయాల్లో ఆనందమూర్తియై రమించే వాడు రాముడు. రామశబ్దం పరమాత్మవాచకం కూడా!

ఆంధ్రులందరూ ఆచరించే పూజల్లో శ్రీరామనవమీ పూజ చాలా విశిష్టమైనది. ఎంతో భక్తితో, ఉత్సాహంతో, ఐకమత్యంతో శ్రీరామనవమీ (జయంతి) వసంత నవరాత్రులు జరుపుకోవడం తెలుగువారికి వెలుగు పూజ!

తిరుమల - తిరుపతి దేవస్థానంవారు ధర్మ ప్రచారపరిషత్తు ద్వారా భక్తులకు అందిస్తున్న పుస్తక ప్రసాదంలో భాగంగా ఆయా పండుగల ప్రాశస్త్యాన్ని వివరించే - చిన్న పుస్తకాలు ముద్రించి, ఉచితంగా అందజేస్తున్న సంగతి - ఇటీవల స్వీకరించిన శ్రావణపూర్ణిమ, ఉగాది - పుస్తకాల ద్వారా గ్రహించి వుంటారు. అదే కోవలో ప్రస్తుతం "శ్రీరామ నవమి" పుస్తకాన్ని అందిస్తున్నాము.

ఈ సేవను తనకు లభించిన మహాభాగ్యంగా స్వీకరించి, రచన చేస్తున్న - ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి, పమిడికాల్వ చెంచుసుబ్బయ్య గారికి అభినందనలు. శ్రీవారి కృపాబలంతో ఇంకా ఎన్నో విధాలైన ఉత్తమ సేవలు వీరు - భక్తులకు అందిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

భక్తులు ఈ 'శ్రీరామనవమీ' పుస్తక ప్రసాదాన్ని స్వీకరించి, ఆనందించి శ్రీవారి సేవలో మరింత ధన్యులూ, కృతకృత్యులూ కాగలరని ఆశిస్తూ "శ్రీ వేంకటరామ స్వామికి" నమస్కరిస్తూ......

సదాశ్రీవారి సేవలో

తిరుపతి

31-03-2006

**ఏ.పి.వి.ఎన్. శర్మ**

ఐ.ఏ.ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తి.తి. దేవస్థానములు

"సర్వేజనా స్సుఖినో భవంతు"

ఓం నమోవేంకటేశాయ

# నిత్య వసంతాంజలి

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచారపరిషత్ శాఖోపశాఖల్లో విస్తరించి, బహుముఖ ధార్మిక, సాంస్కృతిక, ఆధ్యాత్మికాది పవిత్ర కార్యక్రమ నిర్వహణలో అందరికీ చేరువకావాలన్న మహాసంకల్పంతో చేపట్టిన ప్రచారంలో భాగంగా ఆయా పండుగల విశేషాలనూ, పరమార్థాన్నీ, తిరుమలలో ఆనాడు జరిగే విశేష కార్యక్రమాలను వివరిస్తూ, చిన్న పుస్తకాలను ముద్రించి భక్తపాఠకులకు ఉచితంగా ప్రసాద రూపంలో అందిస్తున్నది. అందరూ ఎంతో ఆనందంతో స్వీకరించి, చదివి, ప్రోత్సహిస్తూ - అభినందిస్తున్నారు.

ఈ పర్వసాహిత్య ధార్మిక సేవా సంపదకు ఆమోద సూచనలిచ్చిన తి.తి.దే. కార్యనిర్వహణాధికారి గౌరవ శ్రీ ఏ.పి.వి.ఎన్. శర్మ గారికీ, ఆమోదముద్రతో ప్రోత్సహిస్తున్న గౌ॥ తి.తి.దే. ధర్మకర్తృమండలివారికీ, తగిన సూచనలిస్తున్న పెద్దలకూ హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

ఈ రచనా స్రవంతి అధికారులూ, రచయితలూ పాఠకులూ అనే త్రివేణీ సంగమంగా ప్రవహిస్తుంది. ఇందులో ఎక్కడ సహృదయత లోపించినా - పవిత్రత కుంటుపడుతుంది. అన్నిటికీ శ్రీవారే మూలం! శ్రీవారి కృపతో ఇంతవరకూ ఈ 'పండుగల పుస్తక ప్రసాదవితరణ' నిర్విఘ్నంగా నెరవేరింది. ఇకపై కూడా నెరవేర్తుందనే నమ్మకముంది.

ప్రస్తుతం "శ్రీరామనవమి"ని భక్తులకు అంది స్తాంది- ధర్మప్రచారపరిషత్తు. "శ్రీరామరక్ష సర్వ జగద్రక్ష"గా నిరంతరం మనలో ఆత్మారాముడై విహరిస్తున్నాడు - శ్రీరాముడు. మానవజీవితచరిత్రలో శ్రీరాముని జననం ఒక క్రొత్త కాంతిని నింపింది. సత్యాన్నీ, ధర్మాన్నీ మేళవించుకున్న జీవితం సర్వతోముఖకాంతుల్తో ఎలా ప్రకాశిస్తుందో, నిరూపించింది. రాముని జీవితం దాంపత్య జీవనవైశిష్ట్యానికీ, జననీ జనక భక్తి పారమ్యానికీ, సోదరత్వ సంపదలకూ, ధార్మికపరిపాలన వ్యవస్థకూ, దుష్టశిక్షణ, శిష్టరక్షణాత్మక రాజధర్మపటిష్ఠతకూ - ఇలా ఎన్నో మంచి గుణాలకూ, మంచి భావాలకూ,

మంచి మనుగడకూ మార్గాన్ని నిర్దేశించింది. కనుకనే రాముడు ఆదర్శ మానవుడైనాడు. అచిరకాలంలోనే మాధవుడై ఆరాధ్యుడైనాడు.

ఒకనాడు అంతర్గతమైన మాధవత్వం, "మానవత్వ విలువల్లో" వెలుగులు చిమ్మింది. ఈనాడు – ఆనాటి మానవత్వం మాధవత్వాన్ని బహిర్గతం చేసి, శ్రీరాముణ్ణి దైవంగా ప్రతిష్ఠించింది. శ్రీరాముణ్ణీకాక ఆయన వెంట నీడగా అనుసరించిన సీతమ్మకూ, లక్ష్మన్నకూ, నిత్యసేవలందించిన హనుమన్నకూ దేవాలయాల్లో దేవతమూర్తులుగా ప్రతిష్ఠింపబడే అవకాశాన్ని కల్గించింది. ఎక్కడాలేని విధంగా తిరుమల శ్రీవారి ఆలయంలో సీతారామలక్ష్మణ హనుమంతులే కాక, సుగ్రీవుడూ, అంగదుడూ కూడా కొలువై వుండటం గొప్ప విశేషం.

శ్రీవారి ఉత్సవసేవల్లో 'హనుమద్వాహనం' వుంది. ఆ జానకీ రాముడూ, ఈ వేంకటరమణుడూ ఒక్కరే అనడానికి ఇదొక ఆధారం! జగదాధారునికి అన్నీ ఆధారాలేకదా! ఆధారాధేయ భావం చూపరులకేకాని,

శ్రీవారికి ఇదంతా ఏకమే! అన్ని మూర్తులూ ఆపరమాత్మవే, కనుక ఎవరికి తోచిన మూర్తిని వారు అభిమానించి, ఆరాధించవచ్చు. ఏ పేరుతో ఎవరికి నమస్కరించినా- అది చేరేది సర్వాంతర్యామియైన శ్రీరామ పరబ్రహ్మానికే!

ఈ చిన్న రచనలో తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీరామనవమీ, పట్టాభిషేక ఆస్థాన విశేషాలు, ఈ పండుగను ఆచరించే విధానం, ఆచరించాల్సిన ఆవశ్యకం, అందరి పరమార్థం, వైజ్ఞానిక విశేషాలు, ఆధ్యాత్మిక స్ఫూర్తి - సంగ్రహంగా పేర్కొనడం జరిగింది.

సహృదయభక్తపాఠకులు స్వీకరించి, చదివి ఆనందించి, ఉత్తమ మానవత్వరత్నాలకై రామాయణ మహార్ణవాన్నిమథిస్తారని ప్రార్థిస్తున్నాము.

మా కృషీ - మీ కృషీ కలిస్తే శ్రీవారి కృపామృతం ఇంటి ముంగిట ఏరువై ప్రవహించుట తథ్యం!

అపుడు అందు మునకలు వేసి, తరించుటే మన కర్తవ్యం.

ఇట్టి మహా భాగ్యాన్ని విడనాడరాదన్న భావనతో "పండుగ ప్రసాదాన్ని" సిద్ధం చేసింది - ధర్మ ప్రచార పరిషత్!

మూర్తీ భవించిన ధర్మమైన శ్రీరాముణ్ణి కీర్తించడం శ్రీరామనవమి ఆంతర్యం! 'మానవీయ విలువల్ని" కాపాడి, ఆచరించి, ప్రచారం చేయడం శ్రీరామ జయంతి హృదయం!

ఈ రచనా సేవలో చేయూతనిచ్చిన గ్రంథకర్త లందరికీ వేయిదండాలు.

శ్రీరామునిదయవల్ల మన జీవితం నిత్యవసంతం కావాలని ఆశిస్తూ, అందుకై శ్రీనివాసుణ్ణి ప్రార్థిస్తూ.....

సదా శ్రీవారిధార్మికసేవలో

తిరుపతి **ఏమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

2-4-2006 కార్యదర్శి, ధర్మప్రచారపరిషత్
తి.తి. దేవస్థానములు

## తిరుమల - శ్రీరామనవమి, దశమి ఆస్థాన విశేషాలు

పరమ పవిత్రమైన తిరుమల క్షేత్రం శ్రీహరి నివాసం కావడంతో బంగారుకు సువాసన చేకూరి నట్లయింది. వైకుంఠాన్ని వదలి మహావిష్ణువు తిరు మలపై పుష్కరిణీ తీరంలో అర్చామూర్తిగా నిల్వడం భక్తరక్షణ కొరకే! శ్రీవారి ఆలయంలో నిత్యోత్సవాలు, మాసోత్సవాలూ, సంవత్సరోత్సవాలూ - ఎన్నో ఎంతో వైభవంగా వైఖానస ఆగమానుసారం జరుగుతాయి. 'నిత్యకల్యాణం - పచ్చతోరణం' అనే ప్రశస్తికి నోచుకొన్న ఆలయం - శ్రీవారి నిలయం.

కేవలం శ్రీవారి అవతార నక్షత్రం, కల్యాణ నక్షత్రం, బ్రహ్మోత్సవాలూ మాత్రమేకాక, ఆయా పర్వదినాలూ, జయంతులూ మున్నగునవీ ఇక్కడ నిర్వహించడం సంప్రదాయం. 'ఆస్థానం' అనే పేర్తో - అంటే 'కొలువు' దీరడం - ఒక ప్రత్యేక సన్నివేశంగా నిర్వహిస్తారు - తిరుమలలో.

ఉగాదినాడు శ్రీవారు ఆస్థానంలో పూజలందు కొని, పంచాంగ శ్రవణంచేసి, సంవత్సర ప్రారంభాన్ని - భక్తులకు శుభదాయకంగా ఉండేట్టుగా దీవిస్తారు. ఇది 'ఉగాది ఆస్థానం'. తర్వాత జరిగే ఆస్థానం "శ్రీరామ నవమీ ఆస్థానం'. మరునాడు జరిగేది "శ్రీరామ పట్టాభిషేక ఆస్థానం". ఇలా రెన్నాళ్ళు శ్రీరామరూపంతో శ్రీవారు ఆస్థానం కావడం గొప్ప విశేషం! "కౌసల్యాసుప్రజరామా" అంటూ నిత్యం సుప్రభాతసేవ - శ్రీవారిని శ్రీరాముడుగా భావించి స్తుతించడంతో ప్రారంభమవుతున్నది. ఆనాటి శ్రీరాముడే ఈనాటి శ్రీ వేంకటేశ్వరుడు. ఆ అయోధ్యయే ఈ తిరుమల.

శ్రీవారి ఆలయంలో ఉత్సవమూర్తులుగా శ్రీ భూదేవీ సహిత మలయప్పస్వామివారే కాక, సీతా లక్ష్మణ సుగ్రీవ అంగదాహనుమత్సమేతంగా శ్రీరామ చంద్రమూర్తి, రుక్మిణీ సహితంగా శ్రీకృష్ణమూర్తి వుండటం - శ్రీరామజయంతి, శ్రీకృష్ణజయంతి

సందర్భాల్లో ఈ మూర్తులు ఆస్థానం కావడం చూస్తే – శ్రీవారి శ్రీరామ, శ్రీకృష్ణతత్వాలను గుర్తుచేయడమే కదా! శ్రీవారి ఆలయం సర్వదేవతాలయం. శ్రీవారు సర్వదేవతామూర్తి.

తిరుమల దివ్యక్షేత్రంలో శ్రీవారి శ్రవణా నక్షత్రోత్సవంతోపాటు, ప్రతి నెలా శ్రీరాముని జన్మ నక్షత్రమైన 'పునర్వసు' రోజున సీతారామలక్ష్మణులకు ఊరేగింపు జరుగుతుంది. ఇంతేకాక బ్రహోత్సవంలో ప్రత్యేకంగా ఒక రోజు హనుమద్వాహనంపై శ్రీహరి 'శ్రీవేంకటరాముడుగా' దర్శనమిస్తూ, భక్తుల్ని అనుగ్రహిస్తాడు.

ఉగాది ఆస్థానం తర్వాత చైత్రశుద్ధనవమినాడు రాత్రి (శ్రీరామనవమి రోజు) "శ్రీరామనవమీ ఆస్థానం" అని విశిష్టోత్సవం జరుగుతుంది.

శ్రీరామనవమిరోజు ఉదయం ఆనందనిలయంలో నిత్యమూ నిర్వహించే సుప్రభాత సేవ

అనంతరం భోగ శ్రీనివాసమూర్తికీ, శ్రీవారి మూల విరాట్ పాదపద్మాలకూ ఆకాశగంగా జలంతో అభిషేకం జరుగుతుంది. పిదప ప్రత్యేకంగా మూర్తులకు కూడా ఏకాంతంగా అభిషేకం జరుగుతుంది. అనంతరం శ్రీరామాదిచతుర్మూర్తులనూ పట్టువస్త్రాలతో, విశేషాభరణాల్తో, పుష్పమాలలతో అలంకరిస్తారు.

తర్వాత శ్రీవారి ఆలయంలో మామూలుగా జరిగే కైంకర్యాలు జరుగుతాయి. మధ్యాహ్నం శ్రీమలయప్పస్వామి వారికి కల్యాణోత్సవం, డోలోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవ, వసంతోత్సవాలు జరిగి, స్వామి ఆనందనిలయం చేర్తాడు.

శ్రీరామనవమినాటి సాయంకాలం బంగారు వాకిలి ముందు శ్రీసీతారామలక్ష్మణ మూర్తులను ఒకే పల్లకిపై వేం చేపు చేసి, సర్వాభరణ పుష్పమాలలతో అలంకరిస్తారు. మరొక పీఠంపై హనుమంతుణ్ణి వేంచేపు చేస్తారు – ఉగాది నాడు విష్వక్సేనుణ్ణివలె!

పిదప రాత్రి 7-00 గంటల నుండి శ్రీరాముల వారిని మాత్రం బంగారు హనుమదన్వాహనంపై తిరుమల నాల్గుమాడవీథుల్లో ఊరేగింపు చేస్తారు. (ఈ ఉత్సవంలో భక్తులు నిర్ణీతరుసుం చెల్లించి, పాల్గొన వచ్చు). ఉత్సవానంతరం శ్రీరాములవారు ఆలయం ప్రవేశిస్తారు.

ఆలయంలో బంగారు వాకిలి వద్ద సువర్ణ సర్వభూపాలవాహనంలో సీతా రామలక్ష్మణులకు ఆస్థానం జరుగుతుంది. వీరి ప్రక్కన మరొక పల్లకిపై దక్షిణాభిముఖంగా ఆంజనేయస్వామిని కూడా వేం చేపు చేస్తారు. ఇలా కొలువు దీరియున్న సీతారామ లక్ష్మణ హనుమన్మూర్తులకు అర్చక స్వాములు పూజా నివేదనలు గావించి, అక్షతారోపణం చేస్తారు. పిదప పౌరాణికులు శ్రీమద్రామాయణంలోని "శ్రీరామజనన వృత్తాంతాన్ని" పఠిస్తూ, వివరిస్తారు. పౌరాణికుల్ని తాంబూలమిచ్చి సత్కరిస్తారు. ప్రసాదవినియోగా

నంతరం సీతారామలక్ష్మణ హనుమన్మూర్తుల్ని ఆనందనిలయంలో ప్రవేశపెట్టారు. ఇంతటితో "శ్రీరామనవమి ఆస్థానం" పూర్తి అవుతుంది. (ఇదంతా రాత్రి 11-00 గం॥లకు పూర్తి అవుతుంది)

శ్రీవారిని శ్రీరాముడుగా భావించడం ఇందలి విశిష్టత. అన్నమయ్య కూడా "రామచంద్రుడితడు" అంటూ కీర్తించాడు.

## శ్రీరామపట్టాభిషేకం

చైత్రశుద్ధ దశమినాడు యథాపూర్వంగా ఆలయ కార్యక్రమ కైంకర్యాలు జరిగిన తర్వాత ఆ సాయం కాలం 5-00 గంటలకు బంగారు వాకిలి ముందు బంగారు పీఠంపై శ్రీ సీతారామలక్ష్మణులనూ, మరో పీఠంపై హనుమంతుణ్ణీ వేం చేపుచేస్తారు. హారతి అనంతరం సీతారామలక్ష్మణ మూర్తులను తిరుమల శ్రీవారి ఆలయం మహాప్రదక్షిణ మార్గంలో ఊరేగి స్తారు. వీరికి అభిముఖంగా మరొక పల్లకిలో

ఆంజనేయస్వామివారిని ఊరేగిస్తారు. ఇలా ఉత్సవం జరిగి, చివరకు సన్నిధి వీధిలోని శ్రీ బేడి ఆంజనేయ స్వామివారి సన్నిధికి వస్తారు. అక్కడ మొదట శ్రీరాముని పైనున్న పూలమాలను శ్రీ బేడి ఆంజనేయ స్వామి వారికి ధరింపజేస్తారు. శ్రీరామునికిచ్చిన శేషహారతిని బేడి ఆంజనేయస్వామికి ఇస్తారు. అటునుండి సీతారామలక్ష్మణులు ఆలయం ప్రవేశించి, బంగారు వాకిలి వద్దకు వస్తారు.

ఇక్కడ సర్వభూపాలవాహనంలో తూర్పు ముఖంగా సీతారామలక్ష్మణులను వేం చేపు చేస్తారు. వీరికి ఎడమవైపు దక్షిణముఖంగా ఒక్కొక్క పీఠంపై వానరరాజు సుగ్రీవుణ్ణీ, యువరాజు అంగదుణ్ణీ, మంత్రి హనుమంతుణ్ణీ వేం చేపు చేస్తారు. పిదప అర్చకస్వాములు సీతారామలక్ష్మణులకు కుంకుమా క్షతలను ఆరోపణ చేస్తారు. ఆ అక్షతలను గైకొని, సుగ్రీవ, అందగ, హనుమంతులపై చల్లుతారు.

పిదప పౌరాణికులు శ్రీమద్రామాయణంలోని "శ్రీరామపట్టాభిషేక" ఘట్టాన్ని పఠిస్తూ, వివరిస్తారు. పౌరాణికుల్ని చందన తాంబూలాదుల్తో సత్కరించిన తర్వాత మరలా హారతులిస్తారు. పిదప ప్రసాద చందన శఠారి వినియోగం చేస్తారు. సీతారామలక్ష్మణులను ఆనందనిలయంలో ప్రవేశపెట్టారు. (ఈ పట్టాభిషేక ఆస్థానం రాత్రి 8.00 నుండి 9.00 వరకు జరుగుతుంది) ఇంతటితో "శ్రీరామ పట్టాభిషేక ఆస్థానం పూర్తి అవుతుంది.

## శ్రీరామనవమీ ఆస్థానం - ఆధ్యాత్మిక ఆనంద నిలయం

శ్రీమన్నారాయణుడు భక్తానుగ్రహార్ధమై రాముడుగా, కృష్ణుడుగా, వేంకటేశ్వరుడుగా అనేక మూరుల్తో వెలసి, ఆరాధింపబడుతున్నాడు. మూర్తులు వేరైనా తత్త్వం మాత్రం ఒక్కటే! అభరణాలు వేరైనా అందలి బంగారు మాత్రం ఒక్కటేకదా!

ఉగాదినాడు మలయప్పస్వామిగా నవమినాడూ దశమినాడూ, శ్రీరామచంద్రుడుగా, కృష్ణాష్టమినాడు శ్రీకృష్ణుడుగా - ఇలా ఎన్నెన్ని మూర్తుల్లో, ఎన్నెన్ని ఉత్సవాలూ, ఆస్థానాలూ జరిగినా - అన్నింటా వున్నది శ్రీ మహావిష్ణువే! ఒకే తత్త్వాన్ని తత్త్వజ్ఞులైన పెద్దలు బహువిధాలుగా, బహురూపాల్లో అభిరుచి భేదాన్ని బట్టి రూపొందించినారు.

మానవలోక కల్యాణంకోసం మాధవుడు మానవుడై అవతరించిన రోజు శ్రీరామనవమి. ఇందుకే శ్రీహరి వేంకటేశ్వరుడై అవతరించి, అర్చామూర్తియై సేవలందుకొంటున్నాడు. కాని ఒక విశేషమున్నది - శ్రీరాముడు తానున్న కాలంలో ఋషి హృదయాల్లో మాత్రమే అర్చామూర్తి. లోకంలో మానవుడుగానే ప్రశంసలందుకొన్నాడు. ఆ కొరత తీర్చుకోవడానికే కాబోలు వేంకటాచలంపై లీలామానుషవిగ్రహుడై అవతరించి, పద్మావతిని పరిణయమాడి, మనకోసం అర్చామూర్తిగా ఆనందనిలయంలో ఉంటూ - అనేక ఉత్సవాలు జరుపుకొంటున్నాడు.

కనుకనే శ్రీరామనవమీ, పట్టాభిషేక ఆస్థానాలు రెన్నాళ్ళు నిర్వహిస్తున్నారు. శ్రీరాముని అవతారం నవమి, పట్టాభిషేకం దశమిగా తిరుమలలో ఆస్థానం జరగడంతో - రామాయణ సన్నివేశమంతా ఒక్క మారు స్మరించినట్లవుతుంది.

నిత్యకైంకర్యపరుడైన హనుమంతుడు రెండు ఆస్థానాల్లోనూ శ్రీరామునివద్ద వుండటం - భగవంతునికి నిరంతరం దాస్యరూపమైన సేవ చేయువారు హనుమంతునివలె సకలజన పూజ్యులై, భగవంతునితో సమానంగా మన్నన లొందుతారని సూచన. సుగ్రీవుడూ అంగదుడూ వానర రాజులు. సందర్భానుగుణంగా శ్రీరామునికి తోడ్పడినవారు మిత్రులు. వీరు పట్టాభిషేకాది విశేషసన్నివేశాల్లో మాత్రం శ్రీరాముని వద్ద వుంటారు.

శ్రీరామ నవమినాటికి హనుమంతుడు అయోధ్యలో లేకున్నా - నేటి ఉత్సవాల్లో మాత్రం "యత్ర యత్ర రఘునాథకీర్తనం - తత్ర తత్ర కృత

మస్తకాంజలిః! బాష్పవారి పరిపూర్ణలోచనం"గా ఆ శ్రీరామదూత నిరంతరనివాసం కల్గించుకొన్నాడు. సేవ్యసేవక భావం ప్రభుత్వంలో అనివార్యం కదా!

నిరంతరభగవత్సాన్నిధ్యభాగ్యం కల్గాలంటే హనుమంతునివలె ప్రవర్తించాలి. స్వామికోసం, సర్వస్వాన్నీ త్యాగం చేయాలి. "త్యాగేనైకే అమృతత్వ మానశుః" త్యాగము చేతనే అమృతత్వస్థితి చేకూర్తుంది.

శ్రీరామనవమీ ఆస్థానం - సత్యధర్మస్థాపనకై భగవంతుని అవతారదీక్షనూ, పట్టాభిషేక ఆస్థానం ధర్మపరిపాలన దక్షతనూ నిరూపిస్తున్నాయి. "ఆనాడు నేనే శ్రీరాముడుగా మానవమూర్తినై అవతరించి, ఆదర్శ జీవితం గడిపా"ననీ, "నేనే మరలా వేంకటేశ్వరుణ్ణి అయి కలియుగ మానవుల పాపాలను పోగొట్టూ, భక్తుల్ని ఐశ్వర్యవంతుల్ని చేస్తూ, రక్షిస్తున్నా"ననీ నిరూపిస్తూన్నాడు - శ్రీహరి - ఈ రెండు ఆస్థానాల ద్వారా.

మాధవత్వంలో దాగిన మానవత్వాన్ని బహిర్గతం చేసింది రామావతారం. మానవత్వంలో దాగివున్న మాధవత్వాన్ని వెలికి తీసింది వేంకటేశ్వరావతారం. చివరకు రెండు తత్త్వాలూ ఒక్కటై వెలసింది నేటి శ్రీహరి దివ్య విగ్రహం! అర్చామూర్తిగా కన్పిస్తున్నా శ్రీవారి విగ్రహం సాక్షాత్తూ శ్రీహరిమూర్తియే!

మానవుడు స్వయంకృషితో ఉద్యమిస్తే ఎంతటి మహాకార్యాలైనా సాధించవచ్చుననీ, అటివారికి దైవబలం సదా తోడ్పడుతుందనీ, మనం రక్షించిన ధర్మమే మనల్ని రక్షిస్తుందనీ, ధర్మమే భగవద్రూపమై ఆరాధింపబడుతుందనీ, ఇందుకు మానవ జన్మమే తగిన సాధనమనీ ఈ శ్రీరామనవమీ, పట్టాభిషేక ఆస్థానాలు గొప్ప స్ఫూర్తినిస్తున్నాయి.

మనలోని దైవిక శక్తుల్ని ఆవిష్కరించుకోవడానికి ధార్మిక జీవన మొక్కటే ఉత్తమ మార్గం! ఇందుకే శ్రీవారి నిలయంలో శ్రీరామ ఆస్థానం, పునర్వసు ఉత్సవాలూ నిర్వహింపబడుతున్నాయని భావించవచ్చు.

శ్రీరాముడు నియతంగా పాలించిన ధర్మమూ, సత్యమూ మానవజీవితానికి ఆదర్శగుణ సంపదలు. మనం ఆ మహా సంపదలకు వారసులంకావాలి. ఆ సంపదను ఆనందంగా అనుభవించాలి. తోడివారికీ పంచి పెట్టాలి.

శ్రీరామనవమీ ఆస్థానం – ధార్మిక ఆధ్యాత్మిక జీవన అమృత దివ్యస్థానం.

దశమినాటి పట్టాభిషేకం – దశేంద్రియాలకూ అమృతాభిషేకం.

పంచభూత, మనో బుద్ధిచిత్తాహంకార, దశేంద్రియాత్మకమైన మానవజీవితం – సత్యధర్మాలను నిలయమైతే – ఆనందనిలయంగా ప్రకాశిస్తుంది. అందరి చేతా ఆరాధింపబడుతుంది.

మన ఆత్మయే శ్రీరాముడూ, వేంకటేశ్వరుడూ!

తిరుమలలో జరిగే అన్ని "ఆస్థానాలు" – అమృత స్థానాలే! ఆనంద నిలయాలే!

*"నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ!*
*దేవ్యైచ తస్యై జనకాత్మజాయై"!*

# శ్రీరామనవమి

రామకృష్ణావతారాలు శ్రీమన్నారాయణుని సంపూర్ణావతారాలు. ఇందులోనూ సీతారామ లక్ష్మణులు అన్ని విధాలా మనకు ఆదర్శప్రాయులు. పాతివ్రత్యానికి సీత, పితృవాక్యపరిపాలనకూ, ధర్మాచరణకూ, సత్యసంధతకూ, ఏకపత్నీవ్రతనిష్ఠకూ శ్రీరాముడూ, సోదరత్వదీక్షకూ, పరదారావిముఖతకూ, త్యాగనిరతికీ సౌమిత్రి - చిరస్థాయిగా నిల్చినారు. శ్రీరాముని దివ్యచరిత్రను కీర్తించిన వాల్మీకి ప్రపంచ వాఙ్మయంలో ఆది కవిగా, శ్రీమద్రామాయణం - ఆది కావ్యంగా ఆరాధ్యమూర్తులయ్యాయి.

శ్రీరామునివంటి ఉత్తమగుణసంపన్నుడు మరొకడు లేడని వాల్మీకియే గాదు, విశ్వమంతా ముక్త కంఠంతో కీర్తించి, ప్రశంసించింది. ఆ మహాగుణ సంపద దేశ కాలాలకు అతీతంగా సృష్టివున్నంతకాలం స్థిరంగా వుంటుంది.

సద్గుణసంపదతో రమించువాడూ, ప్రజలను సంతోషపెట్టువాడూ కనుక ఆ మహాత్మునికి రాముడన్న పేరు సార్థకమయ్యింది. ఈ రెండు శక్తులున్నవారు రామునివలె ఆదర్శవ్యక్తులూ, ఆరాధ్యమూర్తులూ కావడంతో సంశయం లేదు. రాముడు భారతీయులకే గాదు - మానవ జాతికే ఆదర్శమూర్తి!

మానవజాతిని తీర్చిదిద్ది, ధార్మిక జీవనం ఎంత మహత్త్వపూర్ణమో, ఎంత విశిష్టమైనదో, ఎంతో ఆదర్శవంతమైనదో తన ప్రవర్తన ద్వారా నిరూపించిన మహాత్ముని జన్మదినమే శ్రీరామనవమి! ఇదే శ్రీరామ జయంతి. ఇట్టి వారి జయంతులు జరుపుకొని, వారి జీవితాన్ని మననం చేసుకొని అందరి సత్యధర్మాలను ఆదర్శంగా స్వీకరించి, యథాశక్తిగా దీక్షతో ఆచరి స్తానని దృఢ ప్రతిజ్ఞ చేసి, ఆచరించడానికి ఫలం దక్కుతుందికాని, ప్రసాదం స్వీకరించి, తృప్తిపడితే చాలదు.

చైత్రశుద్ధనవమినాడు ఆచరించే శ్రీరామనవమి యందు పునర్వసు లేదా దాని ముందటి పుష్యమి అయినా వుంటుంది. సౌరమానం రీత్యా ఆచరించే శ్రీరామనవమి కూడా కొన్ని వేళల్లో వైశాఖ శుద్ధంలో రావడం వల్ల ఆ దినం ఆశ్లేష, మఖ, పుబ్బలలో ఏదో వొకటి అయివుంటుంది. అంతేకాని పునర్వసులేదా పుష్యమి అయివుండదు.

రవి మీనరాశిలో వున్నా, మేషరాశిలో వున్నా చైత్రశుద్ధనవమినాడు మాత్రం పునర్వసు లేదా పుష్యమి నక్షత్రం ఉండటం విశేషం. (కనుకనే తిరుమలలో చాంద్రమాన శ్రీరామ నవమియే ఆస్థానం నిర్వహిస్తున్నారు.

సామాన్యంగా భారతీయులందరూ శ్రీరామ నవమిని యథాశక్తిగా ఆచరిస్తారు. కాని 'ఇతర పండుగలు' మాదిరి అనేక భక్ష్యభోజ్యాలతో విందు భోజనాలతో ఈ పండుగను నిర్వహింపరు. కేవలం బెల్లం, పానకం, నీరు, మజ్జిగ, పెసర బేడల వడపప్పు

మాత్రమే నివేదించి, స్వీకరిస్తారు. అందరికీ ఇస్తారు కూడా! ఇందులకు ఏదేని కారణం వుండక తప్పదు.

శ్రీరామనవమి చైత్రం లేదా వైశాఖంలో వస్తుంది. ఇది మంచి వేసవికాలం. ఎండవేడిమికి శరీరం నిర్వీర్యమై, నిశ్శక్తిమంతమవుతుంది. జీర్ణశక్తి సరిగా జరుగదు. శ్లేష్మం వసంతఋతువునందలి సూర్యకిరణాల వేడికి కలిగి, జఠరాగ్నిని మందగింపజేస్తుంది. ఈ కాలంలో చెమట ఎక్కువ పట్టుంది. ఇందువల్ల శరీరంలోని పోటాషియం, సోడియం లవణాలు తక్కువవుతాయి. ఇది ఆరోగ్యానికి ప్రతిబంధకం అవుతుంది. దీన్ని సరిచేయడానికీ, మున్ముందు కలుగబోవు దుష్పరిణామాలను నిరోధించడానికీ ఆహారనియమాలు పాటించే ఏర్పాటు చేశారు మన పెద్దలు. ఆయుర్వేదం ప్రకారం ఈ కాలంలో చలువ చేసే పదార్థాలూ, చల్లని పెసరపప్పు మున్నగు సేవిస్తే జీర్ణ కోశానికి సంబంధించిన

అనారోగ్యం ఏర్పడదు. జీర్ణక్రియ సులభంగా జరుగుతుంది.

శ్రీరామనవమినాడు ఎక్కువగా పెసర బేడలు (వడపప్పు) నివేదించి ఇస్తారు. పెసలు బుధగ్రహానికి చెందినవి. బుధుడు బుద్ధికారక గ్రహం. పెసరబేడలు సాత్త్వికాహారం కనుక బుద్ధిశక్తిని పెంచుతాయి. మంచి మనస్సును పెంచుతాయి. ఎండాకాలంలో ఆరోగ్యానికి ఇబ్బంది కల్గించక, సుఖశాంతుల్ని చేకూరుస్తాయి.

జ్యోతిశ్శాస్త్రంరీత్యా చైత్ర శుద్ధ పూర్ణిమనాడు చంద్రుడు చిత్తా నక్షత్రంలో వుంటాడు. చిత్త కుజ నక్షత్రం. కుజుడు అగ్నికారక గ్రహం. చంద్రుడు సౌమ్యగ్రహం. జలగ్రహం, అగ్నికి నీరు పడితే అగ్ని చల్లారిపోతుందని. అట్లే అగ్ని సమానమైన వేడిగల ఈ ఋతువులో తీవ్రతాపాన్ని తట్టుకొని, హాయిగా వుండటంకోసం పానకం, నీరు, మజ్జిగ, వడపప్పు మున్నగు చలువచేసే పదార్థాలు స్వీకరించడని శాస్త్రం చెప్పింది.

ఇలా ఆరోగ్యం పరిరక్షణ దృష్టిలో శ్రీరామ నవమినాడు పిండివంటలుగాక, వడపప్పు, పానకం, నీరు మజ్జిగ ఇవ్వడం ఆచార మయ్యింది. ఇట్లే వైశాఖంలో వచ్చే నృసింహజయంతికి కూడా వడపప్పు, పానకం ఇస్తారు.

## ఆచరణ విధానం

శ్రీరామనవమినాడు ఉపవాసం చేసి, పూజాధికం నిర్వహించి, రాత్రి జాగరణ చేయాలని వ్రత గ్రంథాలు సూచించాయి. నవమినాడు విష్ణువు రామావతారమెత్తినందున చైత్రశుద్ధ నవమీ తిథి 'సర్వకామద' (అన్ని కోర్కెలూ తీర్చునది) అయింది. నవమీ ఉపవాసం, రాత్రి జాగరణ చేసి, దశమినాడు నిత్యకర్మానుస్తానం గావించుకొని, భక్తిశ్రద్ధల్తో శ్రీరాముణ్ణిపూజించి, అన్న సంతర్పణ చేయాలి. రామ భక్తులకు యథాశక్తిగా వస్త్రాలంకారాదులు భక్తితో సమర్పించాలి. శ్రీరామనవమీవ్రతాచరణం అనేక పాపాల్ని

పరిహరిస్తుంది. శ్రీరామప్రతిమా నిర్మాణాన్ని గూర్చి, ఎలా దానం చేయాలి అనే విషయాలు లింగపురాణం, రామార్చన చంద్రిక గ్రంథాల్లో కలదు.

చైత్ర శుద్ధపాడ్యమి నుండి నవమి దాకా కొందరు శ్రీరామవసంతనవరాత్రులు నిర్వహిస్తున్నారు. వీటిల్ని గర్భజయంత్యుత్సవాలంటారు. కొందరు శ్రీరామ నవమినుండి తొమ్మిదిరోజులు ఆచరిస్తారు. వీటిల్ని జనన జయంతి ఉత్సవాలు అంటారు. రెంటిల్లోనూ తొమ్మిది రోజులూ శ్రీమద్రామాయణ పారాయణం, రాత్రులందు రామకథాకాలక్షేపం చేస్తారు. నవమి నాడు శ్రీరామజననవృత్తాంతం చదివి, విన్పించి, పూజలు నిర్వహిస్తారు. దశమినాడు శ్రీరామ పట్టాభిషేకం చేస్తారు.

కొందరు శ్రీరామనవమినుండి 'రామకోటి' వ్రాయడం ప్రారంభించి, మరల శ్రీరామనవమికి పూర్తి చేస్తారు. రామనామంలోని ఒక్క అక్షరం మహా పాతకాలను హరిస్తుంది.

మన దేశాన్ని ఏకసూత్రంతో బంధించింది అనాదికాలం నుండి శ్రీరామచరితమే! కవలపిల్లలు పుట్టే రామలక్ష్మణులని పేరు పెట్టడం మన ఆచారం. భారతీయ జీవన విధానంలో రామచరిత్రం అంతర్లీన మైవుంది. రామకథ తెలియని భారతీయుడుండడు.

చైత్రమాసంలోనే మత్స్య, వరాహ, శ్రీరామ జయంతులు వస్తాయి. సంవత్సరంలో వచ్చే దశా వతార జయంతుల్లో మొట్టమొదటిది శ్రీరామ జయంతి.

శ్రీరామజయంతి ఆచరణకు పునర్వసుతో కూడిన చైత్ర శుద్ధనవమి చాలా విశిష్టమైనది. అష్టమి తో కూడిన నవమి శ్రీరామపూజకు పనికిరాదు. నవమి నాటి పూజ మధ్యాహ్నం 12.00 గం.లకు చేయాలి.

ఆంధ్రరాష్ట్రంలో శ్రీరామనవమినాడు సీతా రాముల కల్యాణం జరపడం ఆచారంగా వుంది. రామ జయంతి వలె ఫాల్గున శుద్ధ అష్టమి జానకీ జయంతి కూడ వున్నది.

మూడు మార్లు "రామ, రామ, రామ" అంటే 1000 మార్లు చెప్పినట్లవుతుంది. "కటపయాది వర్గ" సూత్రంలో "రా" య వర్గంలో రెండవ అక్షరం. 'మ' ప వర్గంలో ఐదవ అక్షరం. కాగా 2×5=10. ఒక "రామ" అంటే 10 అనే సంఖ్యకు సంకేతం. రామ×రామ×రామ=10×10×10=1000 అవుతుంది. కనుకనే శివుడు పార్వతికి "రామ రామ రామ" అని ముమ్మారు పల్కితే సహస్రనామో చ్చారణతో తుల్యమని ఉపదేశించినాడు. పైగా శివుడు తాను నిరంతరం జపించే రామ నామాన్నే పార్వతికి తెల్పినాడు.

ఇలా నామస్మరణమాత్రాన్నే సకల పాపాలను హరించి, సర్వ శుభాభ్యుదయాలూ కల్గించే రామనామం – ఆ పేరు గల రాముడూ అవతరించిన రోజును సాత్త్వికవిధానంలో జయంతి పర్వదినంగా భావించి రాముణ్ణి పూజించడం కంటే మానవజాతికి మహాసంపద మరేముంది.

ఋగ్వేదంలో శ్రీరాముని పవిత్రనామం స్మరింప బడింది. శతపథ బ్రాహ్మణం శ్రీరాముని సోదరుడైన భరతుని గాథను వర్ణించింది.

శ్రీరామనవమి - ఆధ్యాత్మిక మూర్తి "వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే। వేదః ప్రాచేతసా దాసీత్సాక్షాద్రామాయణాత్మనా" - వేద వేద్యుడైన పరమాత్మ దశరథనందనుడైన రాముడుగా జన్మించినాడు. వాల్మీకి ద్వారా వేదమే రామాయణ రూపంలో అవతరించింది - అని ఆర్షవాక్యం. నిరాకారపరమాత్మ సాకారమైన తత్త్వం శ్రీరాముడు. రామాయణం సాక్షాత్తూ వేదమే! రామః - అనగా పరమాత్మ అనీ అర్థముంది. అందరి హృదయాల్లో ఆనందరూపుడై రమించువాడు - రాముడు. రామ నామం మధురాతిమధురం. పల్కుటకేగాక, భావించి ఆనందించుటకూ రామనామం మహత్త్వపూర్ణమ యినది.

రాముడు అయోధ్యవాసులనే తరింపజేసినాడు. రామనామం త్రిలోకవాసులనూ తరింపజేస్తుంది. నామికంటే నామమే గొప్పదని పేరుగాంచింది - రామ నామం!

శివుడు నిరంతరం జపించేది రామనామాన్నే! "ఓం నమోనారాయణాయ" అనే నారాయణాష్టాక్షరీ మంత్రంలో "రా" అనే ఐదవ అక్షరం, "ఓం నమశ్శివాయ" అనే శివపంచాక్షరీమంత్రంలోని "మః" అనే రెండవ అక్షరం - చేర్తే "రామః" అవుతుంది. ఈ రెండు మంత్రాలకు ఈ రెండక్షరాలూ ప్రాణం! "నారాయణాయ"లో "రా" లేనిచో "నాయనాయ" అగును. అపుడు "పొందుటకు వీలు లేదు" అని అర్థం. "నమశ్శివాయ"లో "మః" లేనిచో "నశివాయ" = మంగళము కొరకు కాదు - అంటే "అమంగళం కొరకు" అనే అర్థం వస్తుంది. కనుక శివకేశవుల ఏకీకృతమూర్తి రాముడు. రెండు తత్త్వాలూ రామునిలో నిండివున్నాయి.

మూడు మార్లు "రామ, రామ, రామ" అంటే 1000 మార్లు చెప్పినట్లవుతుంది. "కటపయాది వర్గ" సూత్రంలో "రా" య వర్గంలో రెండవ అక్షరం. 'మ' ప వర్గంలో ఐదవ అక్షరం. కాగా 2×5=10. ఒక "రామ" అంటే 10 అనే సంఖ్యకు సంకేతం. రామ×రామ×రామ=10×10×10=1000 అవుతుంది. కనుకనే శివుడు పార్వతికి "రామ రామ రామ" అని ముమ్మారు పల్కితే సహస్రనామోచ్చారణతో తుల్యమని ఉపదేశించినాడు. పైగా శివుడు తాను నిరంతరం జపించే రామ నామాన్నే పార్వతికి తెల్పినాడు.

ఇలా నామస్మరణమాత్రాన్నే సకల పాపాలను హరించి, సర్వ శుభాభ్యుదయాలూ కల్గించే రామనామం – ఆ పేరు గల రాముడూ అవతరించిన రోజును సాత్త్వికవిధానంలో జయంతి పర్వదినంగా భావించి రాముణ్ణి పూజించడం కంటే మానవజాతికి మహాసంపద మరేముంది.

"ధర్మాత్మా సత్యసంధశ్చ" అంటూ రామునిపై వొట్టుపెట్టి లక్ష్మణుడు ప్రయోగించిన బాణం ఇంద్రజిత్తును సంహరించిన సంగతి రామాయణంలో ఉన్నది. రాముని ధర్మాత్మతకూ, సత్యసంధతకూ ఇదొక గొప్ప నిదర్శనం.

ఏకోణంలో చూచినా శ్రీరాముడు సామాన్యులకూ, మాన్యులకూ, యోగులకూ, త్యాగులకూ, మొత్తం విశ్వానికే ఆరాధ్యమూర్తి.

రామునితో సమానమైన మరో దైవంలేదని ఢంకా భజాయించి చాటి చెప్పిన కంచర్లగోపన్నమాట ముత్యాలమూట!

ఆదర్శమానవుడైన శ్రీరాముణ్ణి చక్రవర్తిగా, పురుషోత్తముడుగా, యోగీశ్వరుడుగా, పరమాత్మగా – ఎవరు ఎలా భావిస్తే వారికి అలా సాక్షాత్కరించి, వారిని రక్షిస్తాడు – శ్రీరాముడు.

అందుకే అందరూ "రామరాజ్యం" కావాలని కోర్తుంటారు.

శ్రీరామతత్త్వాన్ని గూర్చి వ్రాయడం అలవికాని పని. ప్రస్తుతానికి చిరు ప్రయత్నం విరమిద్దాం! శ్రీరామచరితామృతసరస్సులో మునిగి, రమిద్దాం!

(ఈ రచనలో దోహదపడిన గ్రంథాలకూ, ఆయా రచయితలకూ, ప్రకాశకులకూ హార్ధిక కృతజ్ఞతాంజలులు)

॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥



